# పాలవెల్లి

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు



నాగేశ్వరుఁడు

హించుఁగాక.

ఆంధ్రప

# అర్పణ

---

లోకోద్ధారకుఁ డగు నాగేశ్వరుఁడు
దీనినిఁ బరిగ్రహించి యనుగ్రహించుఁగాక.

---

# విజ్ఞప్తి

ఇది పాలవెల్లి. పుణ్యాజనులును, సుమనస్కులును నాగేశ్వరునిసాహాయ్యమున దీనిని మథింతురుగాక.

సర్వజ్ఞుఁడు హాలాహలమును గంఠమునం దణఁచియుంచి, చంద్రుని శిరసావహించుఁ గాక.

పురుషోత్తమున కిది గృహలక్ష్మిప్రద మై ప్రకాశించుఁగాక.

అమృతపానము చేసి విబుధు లమృతత్వమును బొందుదురుగాక.

# విషయసూచి





# పాలవెల్లి

౧

## కవిత

ప్రకృతిసౌందర్యంబు, పరమేశుమహిమ
పరికించువేళ నాప్రక్క నిల్చుండి,
యాశ్చర్య మానంద మనుభవింపంగ
నాకుఁ దోడయి వచ్చి నను బ్రోచినావు
నాతోడునీడ వై నను గూడినావు.
నీకు నాకును వేఱు లేక యేవేళ
నీవె నే నయి నేనె నీ వయి యుండి,
యద్వైతభావంబు నందియున్నాము.
తండ్రికాలంబునఁ దాతకాలమునఁ
దండ్రితాతల, తాతతాతల, వారి
తండ్రులకాలానఁ దరతరంబులను,
మాయింట నీ వుండి మముఁ గాచినావు,
మాయింటి వేల్పు వై మముఁ బ్రోచినావు,
మాయింటిరాణి వై మ మ్మేలినావు;
ఏతరంబు దైన, నేవేళ నైన,
నిను మేము కొల్వని నిముసంబు లేదు,
నీవు మ మ్మరయనినిముసంబు లేదు.

# పాలవెల్లి

బాల్యంబుననె తండ్రిఁ బాసి యున్నపుడు
మాకు దిక్కయి నీవు మముఁ బెంచినావు.
చదువుసాములు నేర్పి ముద మిచ్చినావు;
అల్లారుముద్దుగా నరసి యేవేళఁ
దల్లివై పోషించి తని వొందినావు;
మాకన్న ముందుగా మాయింటఁ బుట్టి
పెద్దక్కవై మాకుఁ బ్రియ మిచ్చినావు;
ఆటలఁ బాటల నలరుఁదోఁటలను,
జెల్లెలవై ముద్దు చెల్లించినావు;
మనసున మనసును, దనువునఁ దనువు
నాత్మ నాత్మయుఁ జేర్చి యర్ధాంగి వౌచుఁ
గష్టంబులందు సుఖంబులయందు,
నను విడనాడక, నా ప్రోల నిల్చి,
యానందదుఃఖ, దుఃఖానందములను
ననుఁ గూడి భరియించి, ననుఁ బెంచినావు;
ముద్దులు గురియుచు మురియుచు వచ్చి
నాముద్దుబిడ్డవై ననుఁ గాచినావు;
నాగృహలక్ష్మిరో నాయింటిరాణి
నాముద్దుఁజెల్లెలా, నాముద్దుబిడ్డ,
నావేల్ప, నాయక్క, ననుఁ గన్నతల్లి
కవితామతల్లి! న న్గాపాడు తల్లి,
నాకల్పవల్లిరో, నీకు జేజేలు.

---

# కవీశ్వరునిగానము

ప్రకృతి మెప్పింప నీశ్వరుని మెప్పింపఁ
గవి యొనర్పఁగ లేనికార్యంబు గలదె?
చూడఁ గష్టం బైనచోటులం జూడ
వినఁగఁ గష్టం బైనవింతల౯ వినఁగఁ
గవియె చాలును గాక కలఁడె వేఱొకఁడు!
తలఁపఁ గష్టం బైనతలఁపులం దలఁపఁ
బాడఁ గష్టం బైనపాటలం బాడఁ
గవియె నేర్చును గాక కలఁడె వేఱొకఁడు?
కవి చేయఁగా లేనికార్యంబు కలదె?

* * * * *

వేసవి దీర్ఘ మై వెడలిపోదయ్యె;
విమలప్రతాపంబు వెలుఁగ సూర్యుండు
వేయిచేతులతోడ విరఁజల్లె నగ్గి;
డస్సినతెరువరి డప్పి తీర్పంగఁ
బానీయ మీయక వరుణుండు డాఁచె;
ఊపి రాడుట కైన నొక్కింత లేక
గాలి యెం దుండెనో కానరాదయ్యె;
కన్నెత్తి తన్నింత కననైన వలను

కానిచంద్రంబున గగనంబు తోఁచె;
సరసఁ జేరిన ప్రాణిఁ జలిచీమఁబోలె
మలమల మాఁడ్చుచు మహి మండుచుండె
పగలు రే యన కిట్లు పంచభూతములు
పగలు చూపుచు నుండఁ బ్రాణు లెట్లెట్లొ
దినములు సాగించుకొను చుండె; * * *
* * * ఇట్లు
చనియెను రథయాత్ర; చనియె శ్రావణియు;
అతిలోభి చందాన నట్టిట్టు చూచి
వసువుల నొక్కొక్క వసుధరుం డొసఁగ,
నాకులపా లైన, హాలకర్మ మిగుల
నాకులపాటుతో నందందు సాగె;
గణనాయకచతుర్థి కడచ నేఁ గాని
యణఁగ దావంత యూవంతయు; * * *
* * * నపుడు
నిఖిలలోకము బాధ నిజబాధ గాఁగ
నరయు చుండినకవీశ్వరుఁ డొక్కరుండు
పొలములఁ గనుఁగొంచుఁ బోయి యూడాడఁ
దల వ్రేలఁగా నైచి వెలవెలఁబాఱె,
కార్చుట కొక్కింత కన్నీరు లేక

వంత నొందుచు నున్న వరికన్నెఁ జూచి
వరికన్నె కాపత్తు దరిఁకొన్న కతన
గుండియల్ తటతట కొట్టుకొనఁగ,
మది దిగుల్ సెందంగఁ, బెదవు లెండంగ,
విన్నఁబా ఁ పొదవంగ, వెడనవ్వు నవ్వి
యీమూల నామూల నేడ్చుచున్నట్టి
కాఁపుఁగన్నెలఁ జూచి కడుజాలి నొంది
కల్లంబుదరి నొక్కగట్టుపై నున్న
నున్నఁగాయలపొన్న గున్నక్రీనీడఁ
గూర్చుండి ధ్యానించి కొంత సేపటికి
భావంబులోనుండి పై కుబ్బురీతిఁ
గన్నీళ్లు కాల్వలై కాఱుచుండంగ
నీరెలుంగునఁ గంఠ మెత్తి యేమేమొ
పరమేశ్వరునిఁ గూర్చి పాడఁగాసాగె.

*     *     *     *     *

*     *     *     *     *

ఏపాట పాడెనో యీశ్వరుం డెఱుఁగుఁ
బ్రకృతి మొఱింగినపగిదిఁ గన్పట్టె
ఆపాటఁ గలయర్థ మరసి కాఁబోలు
రామ రామా యంచు రాచిల్క యొకటి

## పాలవెల్లి

పొన్న పైకొమ్మపై పొంచుండి పలికె;
ఏమూలనుండియో యేతెంచి బల్లి
కృష్ణ కృష్ణా యంచుఁ గెలఁకులం బల్కెఁ;
ఎందుండియో వచ్చి యెదురుగా వ్రాలి
వాసుదేవా యంచుఁ బలికెను గ్రద్ద;
ప్రక్కపుట్టలనుండి ప్రాఁకుచున్ వచ్చి
యుస్సుస్సు రనుచుండె నురగం బొకండు;
కలఁత నొందుట నేమొ తల యూఁచసాగె
నెదుటిగట్టున నున్న యీఁతచెట్టొకటి
డాఁగినగుహనుండి డాయ నేతెంచి
పలుకరింపఁగ వచ్చెఁ బవనదేవుండు;
అంబరకాంత నీలాంబుదాంబరము
మోమున సిగ్గుతో ముసుఁగిడి యుండ
దానిచాటుకుఁ బోయి దాఁగె సూర్యుండు;
పాటలో భావంబు భావించి యిట్లు
ప్రకృతియుత్తలపాటు భంగపాటొంద
సానుభూతిని దేవుఁ డశ్రువుల్ రాల్చె
ననురీతిఁ బైనుండి యమృతంబు గురిసె;
తాపంబు చల్లారె దానఁ బ్రాణులకుఁ
గోపంబు చల్లారెఁ గువలయంబునకు.

## పాలవెల్లి

ముసుఁగూడ్చి గగనంబు ముసిముసి నవ్వె;
తనప్రతాపము తగ్గి తరణి కన్పట్టె.
పిల్లతెమ్మెర వచ్చి మెల్లఁగా వీచి
యెల్లరయుల్లముల్ చల్లఁ గావించెఁ;
దల యెత్తి వరికన్నె కలకలలాడి
యానందవారి నోలాడుచు నుండె;
వరికన్నె మోదంబు పరికించి యప్పు
డాకాఁపుఁగన్నియ లందందు నెందు
నాట లాడుచు మేలిపాటఁ బాడుచును
బరుగెత్తసాగిరి పరితోష మొప్పఁ;
బరమేశ్వరునికృపావైచిత్రి కలరి
పాటఁ బాడుచుఁ గవీశ్వరుఁ డింటి కేఁగె.

* * * * *

ప్రకృతి మెప్పింప నీశ్వరుని మెప్పింపఁ
గవి చేయఁగా లేనికార్యంబు గలదె?

---

## కే రా ణి

ప్రకృతిసౌందర్యసౌభాగ్యంబుఁ జూచి
పరమేశ్వరుని ప్రేమ వైచిత్రిఁ జూచి
మనుజునిభాగ్యంపు మహిమంబుఁ జూచి
యానందవార్ధి మున్గాడు చున్నప్పు
డాకస్మికంబుగా నవతార మంది
క్రొత్తవన్నెలతోడఁ గ్రొమ్మొల్క లెత్తి
ప్రాఁతవిచారముల్ పలుతెఱంగులుగఁ
బై ప్రాలి యానందభంగం బొనర్చి
మానఁబోఱిన పుండ్లు మఱల రేఁపుచును
భరియింపఁగా రానిబాధలం బెట్టు
ననుభవించినవాఁడె సాక్షి దీనికిని.

* * * * *

శ్రీవిష్ణుపదసమాశ్రితుఁ డైనకతనఁ
జండప్రతాపనిస్తంద్రత్వ మొప్పఁ
దపనాహ్వయంబు సార్థకము గావించి,
భరియింపఁగా రానికరములం బట్టి
సరసులజీవనస్వాముల నింకించి,
సకలారి సమ్మోదసంధాయి యాచుఁ,

## పా ల వె ల్లి

కువలయపీడ నిక్కూటముగాఁ జేసి
క్రోధంపు వీరంపు ఘోరంపు రీతి
ప్రకటించి ప్రకటించి పరిపాలనంబుఁ
గావించి కావించి ఘనతఁ జూపించి
కాలవశంబునఁ గాంతి యడంగ
నినుఁ డస్తమించె; * * * * * *
* * * * * చల్లనిరాజు వచ్చె
పాలు పొంగినయట్లు పండువెన్నెలలు
నాల్గుమూలల నిండి నలు వొందసాగె
శాంతరసంబున జగతి రంజిల్లె;
ప్రహ్లాదనంబునఁ బ్రకృతి యుప్పొంగె.

* * * * *

నిమ్మ దాలెమ్మలకొమ్మల కమ్మఁ
దావులం దావులం దాఁ గొల్లఁగొట్టి
పిల్లతెమ్మెరబంటు మెల్లఁగా వచ్చి
తనపాదములకు నర్చన సేయు చుండఁ
దనదుసౌరభ్యంబు, తనదుసంపత్తి
వ్యాపించు చుండ, నవ్యామోద మైన
మాలతీయువతి సమ్మానంబుతోడఁ
గైదండ యొసఁగి ప్రక్కను నిల్చియుండ,

సన్మార్గచారి నైన జా నొందురాజు
ప్రాణేశ్వరుండు మోహపుం జూపుతోడం
దనుం జూచుచుండం దెల్లనిపూలచీర
మేన నిండుగం దాల్చి మించి శేరాణి
చెంబేలికన్నియ చేం బూని నిలిచి,
శృంగారరసము మూ ర్తిని దాల్చినట్టు
లానందమున నూంగులాడుచు నుండె.
శేరాణియందంబు ప్రీతితోం జూచి
యచ్చెరు వందుచు నచటం గూర్చుంటి;
తలపోంత లెన్నేని కలుగంగాసాగె.

*  *  *  *  *

హో పరమేశ్వరా, హో కన్న తండ్రి,
యీరీతి నీకృపాదృష్టి నాపైని
గనుపట్టంగాం జేసి ననుం బ్రోచినావె?
చలువవెన్నెలలోని తెలినిగ్గుం గూడి
యలమి, వింతలు గొల్పు నాకురంగులను
గనుల కానందంబుం గలిగించినావు;
పిల్ల తెమ్మెర యూంచ మెల్లంగా నూంగి
పువ్వుల నవ్వులపొలుపు చెన్నొందు
వలపులం గొల్పి కొమ్మలు పాడుచుండు

మిక్కిలి సన్నంపుమేలిపాటలను
జెవుల కానందంబు చేకూర్చినావు;
తలిరుగుత్తుల వీడి తముఁ గూడి వచ్చు
తేనెబొట్టులతోడి తేఁకువన్ గుత్తియు
మంచుబిందువుల కమ్మందనంబులను
మేని కానందంబు మేకొల్పినావు;
రాలక కొన్నియు, రాలి కొన్నియును,
రాలి రాలక కొన్ని లీలలం జూపి,
పూలు చల్లుచు నున్న మేలితావులను
ముక్కున కానందమును గూర్చినావు;
గుత్తుగుత్తులు గాఁగఁ గొల్లకొల్లలుగఁ
దీర్చి యమర్చిన తీయని పండ్ల
జిహ్వ కానందంబు చేకూర్చినావు;
ఇంద్రియంబులను నా కిచ్చియున్నందు
కింత యానందంబు నిచ్చియున్నావు.
నీ ప్రేమ యెంతని నిలిపి వర్ణింతు?

*　　*　　*　　*　　*

నీ ప్రేమయే యెందు నిలిచి కన్పించు,
నీ ప్రేమయే యెందు నిలిచి విన్పించు,
నీ ప్రేమయే యెందు నిలిచిస్పృశించు,

నీప్రేమయే యెందు నిలిచి వాసించు ;
నీప్రేమయే యెందు నిలిచి రుచించు;

* * * * *

ఇంద్రియంబులతోడ నెఱిఁగెదఁ గాని
వివరింపలేను నీప్రేమతత్త్వంబు;
ఏయింద్రియమ్ముతో నెట్లు నీప్రేమ
యనుభవింతునో దానిఁ గనుఁగొనంజాల
కందునో విందునో కనలేను * *
* * * దాని
యందంబుచందంబు నరసికోలేను
విందునో తిందునో వివరింపలేను;
కాని నీప్రేమయే కనవచ్చు నెందు
విరులగుత్తులలోన విన్నయట్లుండుఁ
గమ్మఁదావులలోనఁ గన్నయట్లుండు
తేటవెన్నెలలోనఁ దిన్నయట్లుండు;
గొనబుమంచునను మూర్కొన్నయట్లుండుఁ;
గోమరుటాకులను దార్కొన్నయట్లుండు;
వేఱొండెఱుంగ నీప్రేమయే కాని;
వేఱొండు తలఁప నీప్రేమయే కాని;
హా, నాయదృష్టమే మనవచ్చుఁ దండ్రి ;

ననుఁ బోటిధన్యుఁ డున్నాఁడే నా తండ్రి!
ధన్యుండ, ధన్యుండ, ధన్యుండ నేను
నాదుభాగ్యమె భాగ్య మహా తండ్రి * * *
* * * * * యంచుఁ
జిత్తంబులో నిట్లు చింతించు చుండి
యానందపారవశ్యమున నై మఱచి
కూర్చుంటి—కూర్చుంటి—కూర్చుండియుంటి

* * * * *

* * * * *

ఎంతసే పుంటినో యెఱుఁగ నింతేని;
ఇంతలో—అక్కటా—యేకతంబుననొ
కేరాణికొమ్మ తా రివ్వనఁ గదలె;
పూవులు మంచుఁదుంపుసలతోఁ గలసి
జలజల మంచుఁ బెక్కచప్పుడు చేసి
నెమ్మేనిపై రాలి నిలువెల్లఁ దడిపి,
పారవశ్యంబునఁ బడి యున్న నాకుఁ
జప్పున నొక్కింత చైతన్య మబ్బె;
ఆకస్మికంబుగా నట్లు చైతన్య
మబ్బినయపుడు నాయంతరంగంబు
లోకాంతరమున—ఆలోకమార్గమున—

వేఱొక్క-దృశ్యంబుఁ బెట్టె నాయెదుట;
ఆనంద మది యదృశ్యం బయ్యె; * * * *
* * * * * * అంత
గుండె జల్లనెఁ గంటినుండి నీర్కా-తెఁ
గాళ్లును జేతులుఁ గంపంబు నొందె

* * * * *

అట్టిపున్నమరాత్రి—అట్టిపూఁదోఁట
అట్టివెన్నెలలోన—అంత శాంతముగ—
అనుఁగుబిడ్డకరంబు నంది నిల్చున్న
యాత్మేశ్వరీరూప మది తోఁచె నెదుట

* * * * *

ఎన్నియేం డ్లయ్యె నాయింతినిఁ బాసి
కల నైన నొకసారి కనఁబడదయ్యె;
నిలిచినఁ గూర్చున్న నిదురవోయినను
జెలులతో ముచ్చటల్ పలుకు చుండినను
ఏకాంతమున నుండి యీశ్వరుం గొలిచి
ధ్యానించు చున్నను, బ్రార్థించు చున్న
నేమి తలంచిన నేమి చేసినను
బ్రియురాలు హృదయంబు వీడ దెన్నఁడును
బిడ్డడెందంబును విడువ దెన్నఁడును

పంతంబు వైచినపగిది నిర్వారును
నను వీడి యేగిననాఁటనుగోలె
నెంత చింతించిన నెంత కోరినను
గాంతయుఁ బిడ్డయుఁ గన్పడకుండ్రి
కత మేమి యో నేఁడు కన్పట్టి రెదుట

* * * * *

తన కొక్క చెలియ కైదండ యొసంగఁ
జెంత నిల్చినబిడ్డ చేయి చేఁబూని
నాముద్దుటింతి కన్పట్టె నాయెదుట
పలుకరింపఁగలేదు పలు కాడలేదు
నిశ్చేష్టయై కాంత నిలుచుండె మ్రోల
ఎదుట నొప్పుచు నున్నదృశ్యంబు చూచి,
చేఁగలంచినరీతిఁ జిత్తంబు కలఁగె.
ప్రాణేశ్వరీయంచుఁ బలుకరించినను,
బలుకాడదయ్యె నా ప్రాణవల్లభయు;
కన్నతల్లీయంచుఁ గరములఁ జాపఁ
గరము లందియ్యదు కన్నఁబిడ్డయును,
క్షణమాత్ర మీరీతిఁ గన్నులయెదుట
నీదృశ్య మిట్లుండి యెడఁబాసె మఱల;
సంపూర్ణమైనట్టి చైతన్యమబ్బె.

* * * * *

ఆకసంబునఁ జంద్రుఁ డట్టులే యుండె;
వెన్నెల యట్టులే వెలుఁగుచు నుండె;
పిల్లతెమ్మెర యట్లు వీఁచుచునుండె;
ప్రియయును జెలికత్తె బిడ్డయుం గూడ
మాయ మైపోయిరి, మఱి కానరారు.

అవల మాలతియును, నివలఁ జెంబేలి
యెనయంగ, రేరాణి యెప్పటియట్ల
కన్పట్టు చుండె నాకన్నులయెదుట.

కాంతయు బిడ్డయుఁ గన్పడ్డనిముస
మేమి భావంబులు హృదయంబులోన
జనియించెనో చెప్పఁజాల నెన్నఁటికి
ఆనంద మయ్యెనో, యద్భుతము నాకు
వంతయే యయ్యెనో వచియింపఁజాలఁ;
బలుక శక్యము కానిభావంబు కలిగె;
నిముసంబు మాత్రమే నిలిచె నారీతి;
అంతలో నాభావ మది యస్తమించె;
పూర్ణ చైతన్యంబు పొడమినంతటనె
స్పష్ట మహాభావంబు పైకిఁ గన్పట్టె.

*   *   *   *   *

*   *   *   *   *

పంతంబు వైచినపగిది నిర్వురును
విడనాడి పోయిరి—బిడ్డయు, సతియు;
ఒక్క మాసములోనె, యొక్క రీతిగనె,
నా ప్రాణములు రెండు నను వీడిపోయె.
వాడికోలలతాఁకు వడినట్లు మనసు
గాయమై పడరానికాఁటియం బొందె,
వ్రణములచే బాధ పడియుంటిఁగాని,
కత్తికోఁతలచేతఁ గలఁగితింగాని,
యట్టికాఁటియఁ బొంద నానాఁడుఁ గూడ.
భరియింప రాని యా బాధకు నెట్లు
ప్రాణముల్ నిలిచెనో వచియింపలేను.
దైవవిలాస మింతయు నంచు నెట్లొ
యనుభవించితి దాని;—

*     *     *     *     *

అనుభవించితిని.

తనవిలాసం బంచుఁ దలపోయుకతనఁ
బరమేశ్వరునకు నాపై జాలి కలిగె;
తన ప్రేమయే యెందుఁ గనుపట్టఁ జేసి,
యిహసుఖంబులచెంత కేఁగఁబోనీక,
నా యింద్రియములకుఁ జేయూత యిచ్చి

తన కధీనంబులై తనరఁగాఁజేసి;
నిర్మలానందంబు నింపి నాయెదను,
బూర్వవ్రణము మానిపోవుచందమునఁ
బ్రేమతైలపుఁబూఁత బ్రీతిఁ జేయుచును,
బ్రేమౌషధంబును బ్రీతి నిచ్చుచును,
నామీఁదఁ గనుఁగల్గి ననుఁ బ్రోచు చుండె.

*   *   *   *   *

మానఁబాఱుచు నుండె మనసులో వ్రణము;
మాసిపోఁజొచ్చెను మనసులో వ్యధలు;
తలపోయ మానితిఁ గలికిబిడ్డలను;
దేవుని ప్రేమయే తెలియుచునుంటి;
మునివతంసము లైన నెనయఁగా లేని
యింద్రియాతీతమై యే పొందుచుండు
శాశ్వతానందంబు సమకూర్చుకొఱకు
నాపైని జాలిచే నా యింద్రియములు
తన కధీనంబు లై తనరంగఁ జేసి
తన ప్రేమ ఛవి చూపి, తనివొందఁ జేసి,
పరమేశ్వరుండు కాపాడుచు నున్న
యీసమయంబున నీరీతి నాకు
నిట్టిదృశ్యం బేల యెదుటఁగన్పట్టె;

నిదురింపనీయక, నిలువంగనీక,
తిననీక, మననీక, నను బాధపెట్టి
మానఁబాఱుచు నున్న మహితవ్రణంబు
మేకు గట్టిగఁ గ్రువ్వ మేల్కొన్నరీతి
రేఁగిన దక్కటా — రేఁగిపోయినది!
ఏల నా కీదృశ్య మిట్లు కన్పట్టె!
ఏల నా కీవ్రణం బిటు రేఁగిపోయె!
కాఱుచు నున్నరక్తంబును జూడు!
కనరావు కన్నులు, వినరావు చెవులు;
ప్రాణముల్ తావులఁ బాయుచు నుండె;
భరియింపలే నింక భరియింపలేను;
ఇందాక నాచెంతనే యున్ననీవు
కనఁబడ విప్పుడు కారణం బేమి?
వ్రణవైద్యుఁడవు గదా, పాఱిపోయెదవె?
రమ్ము వేగము రమ్ము,రమ్ము నాతండ్రి!
రమ్ము నీప్రేమతైలమ్మును దెమ్ము!
లెమ్ము, నీప్రేమౌషధమ్ము నా కిమ్ము!
వడి లెమ్ము, వడి రమ్ము, వడిఁ దెమ్ము తండ్రి,
తనువుపైఁ జేతనత్వం బున్నకతన
భరియింపఁజాల నీబాధ నాతండ్రి!

మొదటఁ బ్రేమౌషధమ్మును ద్రావ నిచ్చి,
చేతనత్వంబు వోఁజేసి, యాపైని
బ్రేమతైలముఁ బోసి, బిగియించి కట్టి,
నాబాధలను బాపి, నన్ను రక్షించు,
నాతండ్రి, నాయయ్య, ననుఁ గన్నతండ్రి,
చాలును, జాలును, జాలి చూపించు
మని యిట్లు ప్రార్థింపఁ బ్రార్థింపఁ దుదకుఁ,
'గోకో' యనుచు నొక్కకూఁత విన్పడియె,
కోమ్మ్కో మ్మిదె ప్రేమ కో మ్మంచుఁ బలికి
పరమేశ్వరుండు నాపై జాలి చూపి
తనప్రేమ నాపైని దసరంగఁజేసి,
వ్రణబాధ తగ్గించి, పండువెన్నెలను
దనప్రేమతత్త్వ మంతయు నాకుఁ జూపి
యనుభవింపఁగఁజేసె నా నందమహిమ.

*    *    *    *    *

*    *    *    *    *

ప్రకృతిసౌందర్యసంపత్తి యెట్టిదియొ,
పరమేశుప్రేమప్రభావ మెట్టిదియొ,
అనుభవించినవాఁడు సాక్షి యొక్కండె.

---

## గులాబి

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించువేళఁ
బురుషునిమహిమంబు పొడసూపుచుండు;
పురుషునిమహిమంబుఁ బరికించువేళఁ
బ్రకృతిసౌందర్యంబు రహి నించు చుండు;
ప్రకృతిపూరుషు లేకభావంబు నొంది
యద్వయానందంబు నందించువేళ
నద్దంకు లెన్నియో యవతార మంది
యనుభవింపఁగనీక యారటపెట్టు!
గురు వొక్కఁడే దానిఁ గొనసాగఁజేయు
ననుభవించినవాఁడె సాక్షి దీనికిని.

* * * * *

శ్రీ మించుమించులన్ జెన్నారుఘనులు
జీవనంబు లొసంగి, చింతఁ గోల్పుచ్చి,
సరసులఁ బోషించుసమయ మేతెంచె.
అసమర్థులైనట్టి యఖిలభూజనులు
వసులాభ మొందు భవ్యదినంబు లయ్యె;
కడుపార నన్నంబుఁ గల్గింపఁ జాలి
కన్నపండువు గాఁగఁ గన్పట్టు చున్న

వరలక్ష్మిఁ బూజించి, భక్తిఁ జూపించు
శ్రావణీశుక్రవాసర మేఁగుదెంచె.

భుక్తిపై ననురక్తి, శక్తిపై భక్తి
నొక్కరీతిగఁ జిత్త ముప్విళు లూరఁ
బిండివంటలతోడ విసువు లేకుండ
భుజియించి యాయాసమును బోవ నాడ
నిలు వీడి, దవ్వుగా నెందేనితిరిగి,
సాంధ్యకృత్యంబులు సరవిఁ గావించి,
పరమేశనామ సంస్మరణంబుతోడఁ
బ్రణవజపంబుతో వడివడి గాఁగ
నింటికి నొక్కండ నేతెంచు చుంటి.

దరియయ్యె మాయిల్లు; ద్వారంబునందుఁ
దియ్యమామిడిబంటు తేఁకువన్ నిల్చి
భయమును జూపి, కావలిఁ గాచు చుండె;
మామిడిబంటుసేమంబు నెఱింగి
ద్వారంబు దాటి లోపలి కేఁగు చుంటిఁ
గన్నుపండువు గాఁగఁ గన్పట్టె నెదుటఁ
గూర్మి మీఱఁగ నొక్కకొల్వుకూటంబు.

*　*　*　*　*

*　*　*　*　*

## పాలవెల్లి

ఇరుగెలంకులను గన్నేరుకన్నెబంట్లు
పూలమైమఱువు లింపులు గుల్కఁ దాల్చి
సారంగరాగవిస్తారంబు మీఱఁ
గైవారములు ప్రీతిఁ గావించు చుండ
విరివింటిజోదు లన్ బిరు దొందుబంట్లు
మల్లియల్ బారు లై మన్ననల్ సేయ,
నాతపత్రము కేల నంగుగాఁ బూని,
పోకబోదియ సేవ పూన్కిమైఁ జేయఁ,
దెలిపూలచామరంబులు సేతఁబూని
గరుడవర్ధనములు పరిచర్య సేయ,
సంపెంగ విరజాజి సన్నజాజులును!
పారిజాతము నందివర్ధనంబులును,
చేమంతి మొదలైన శృంగారవతులు
పూవు లాకులును జేఁ బూని నిల్చుండ,
నారికేళాంగనల్ వల్గడం బట్టు
నుల్లభం బన నొప్పి, తెల్లజుక్కలను
గొనబులు గుల్కునల్లని యంబరంబు
క్రిందవెన్నెల లీను చందురుం డన్న
కాచవిద్యుద్దీప కళికవెల్గునను
రంగుఁబూవులతోడ రాణ నొప్పారు

నాకుఁ బచ్చనిచీర హాసముమైఁ దాల్చి
తనతావి, తనయీవి, తన ఠీవి యలర,
రాణులు తలఁ దాల్చు రాణివాసంబు
లలితపల్లవపాణి, యలినీలవేణి
విరుల కెల్లను రాణి పరమకళ్యాణి
యభయముద్రను దాల్చి యానంద మొప్పఁ
గొల్వుండె నాకొల్వుకూటంబునందు.

*   *   *   *   *

కొల్వున్న విరిరాణిచెల్వు వీక్షించి
భయవినయములు సంభ్రమమును గూడి
ముప్పిరి గొనుచుండ, ముందుకు వచ్చి
సాష్టాంగముగ నమస్కారంబు చేసి
సభ యెల్ల నొకసారి సంతసం బొప్పఁ
దిలకించి, యెదుటనే చెలఁగుచు నున్న
పచ్చికపఱపుపై భద్రాసనమున
భక్తిమైఁ గూర్చుండి, పరమమోదమునఁ
జేమోడ్చి, యేమియో చింతించుచుంటి;
ఇంచుకసేపు చింతించుచు నుండ,
స్వాంతంబు విరిరాణిపై నిల్చిపోయె.

*   *   *   *   *

## పాలవెల్లి

కొలువునం దంతటం గూడి యున్నట్టి
పరివారముల్ స్మృతిపథమును దప్పె
విమలసాంద్రం బైనవెల్గు వెన్నడుమ
విరిరాణి యొక్కతే విలసిల్లు చుండె
చెదరుపాటింతేని చేరంగనీక
విరిరాణి యొక్కతే వీక్షించు చుంటి.
వీక్షింప వీక్షింప విరిరాణిపైని
నాదుచిత్తంబు లగ్నంబు కాఁజొచ్చె.

* * * * *

చిన్నారి పొన్నారి చిగురువ్రేళ్లములు
కదలాడు చుండఁ జక్కనిచిక్కనైన
వేణురావము మెల్ల వినఁబడు చుండె.
మంచుఁదుంపురులతో మలసి, మందముగ
విరిగందవాడిఁ బూని, పిల్లతెమ్మెరలు
గంతు లాడుచును జెంగట నాడుచుండె.
ఆపాట లాయాట లరయుచు నుంటి
నింద్రియంబుల వెల్ల నేకత్వ మందె.
కనులతో వినుచుంటిఁ గనుచుంటిఁ జెవుల;
నాలుకతో వాసనలు చూచు చుంటి
ముక్కుతోఁ దాఁకుచు మురియుచు నుంటి

తనువుతో వినుచుంటిఁ గనుఁగొంచు నుంటి
నేయింద్రియమ్ముతో నేమేమిపనులు
సేయుచు నుంటినో చెప్పంగఁజాలఁ
గను ముక్కు సెవులును దనువు నాలుకయు
నన్నియు నొక్కఁడై యానంద మొసఁగె.

* * * * *

* * * * *

విరిరాణియందంబు వీక్షించు చుండి,
నిశ్చలధ్యాననిర్నిద్రభావమునఁ
గొంతసే పీరీతిఁ గూర్చుండి యుండ
విరిరాణి వేఱొక్కవిధముగాఁ దోఁచె.

వేణుదండము చేత వింతగాఁ బట్టి
యంగుళు లార్చుచు, నందంబు మీఱ
నూఁదుచుఁ బ్రణవంబు పాదుకొల్పుచును
మంద్రమధ్యమతారమహిమముల్ సూపి
తానమానమ్ముల గానమ్ము సేయు
తతదీప్యమానసుందరవిగ్రహంబు
కనుపట్టుచుండె నాకన్నులయెదుట
విరిరాణి యారీతి వింతగా మాఱి
యననుభూతానందమందు నన్ ముంచె.

ఆదివ్యవిగ్రహం బటు చూచు చుండి
యాఁడుదో, మగవాఁడొ,యనుకొంచు నుంటి;
అనుకొను చున్నప్పు డంతలోపలనె,
రాధరూపం బట్లు రాజిల్లె నదియు;
అహహా, రాధాయంచు నను చున్నయంతఁ
గృష్ణరూపం బట్టె యెదుటఁ గన్పట్టె;
అహహా, కృష్ణా యంచు ననఁబోవు చుండ
మఱల రాధగ రూపు మాఱి కన్పట్టె;
రాధయో, కృష్ణుఁడో, గహిఁ జూడలేక,
కృష్ణుఁడో, రాధయో, యెఱుఁగంగ లేక,
చిత్తమిట్టట్టులు చెదరుచు నుండ,
నొకమార్పు నాలోనె యుదయంబు నందె
రాధ యై దృశ్యంబు రాజిల్లు చుండ,
నేనె కృష్ణుం డన్న యెఱుక కన్పట్టె;
కృష్ణుఁ డై దృశ్యంబు ప్రీతి నింపంగ
నేనె రాధ న టన్న యెఱుక కన్పట్టె;
వేణువు నాచేత వెలుఁగుచు నుండె.

మంద్రమధ్యమతారమహిమముల్ వెలయఁ
దానమానముల నన్యూనంబు గాఁగ
దృశ్యం బొనర్చెడు దివ్యగానంబు

ననుకరించుచు దాన నైక్యంబు నొందు
చందాన గానంబు సలుపుచు నుంటి
దృశ్య మీరీతిని దివ్యగానంబు
గావించి కావించి కడకుఁ దా నొక్క-
యానందనృత్యంబుఁ బూనెఁ గావింప.
ఆనృత్యమునకు వేయనురూప మైన
నృత్యంబు గావింప నే మొదలిడితి.
దృశ్యంబు నేనును బ్రేమ మీఱంగ
ననురూప మైననృత్యము సేయు చుండఁ
దనవైపు దృశ్యంబు నను లాగఁజొచ్చె.
దృశ్యంబు రాధయై యేను గృష్ణుఁడుగ,
దృశ్యంబు కృష్ణుఁ డై యేను రాధగను,
నొండొరులను వీడి యుండంగ లేక
విమలసాంద్రానందవిభవంబు గాఁగ
నాలింగన మొనర్చునట్లు కన్పట్టె.
ఆలింగనంబు దృశ్యంబుతో నిట్లు
కావించి, నిర్మలాఖండనిశ్చలమ
హాద్వైత మైన బ్రహ్మానందమందు
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచు నుంటి.

*   *   *   *   *

ఎంతసే పుంటినో యెఱుఁగ నిమ్మాడ్కి
ఇంతలో — అక్కటా — యేకతంబునను
యెవ్వరో వెనుకకు నీడ్చినట్లయిన
జప్పున నొక్కింత చైతన్య మబ్బె.
చైతన్య మబ్బినసమయంబునందు
గాఢాంధకారంబు గప్పె నల్దెసల.
లేవయ్యెఁ జుక్కలు; లేఁడయ్యె రాజు
వెన్నెల లేదయ్యె - వెలుఁగు లేదయ్యె.
ఆకాశ మంత మేఘావృతం బయ్యె!
నలుగెలంకులను గన్పట్టె దేమియును;
చిటపొట పడుచుండె చినుకులగములు;
విరిరాణి కౌఁగిలి వీడుచు నుంటి
కాలసర్ప మొకండు కాలఁ దాఁకుచును
బ్రాకిపోవుచు నున్నపగిదిఁ గన్పట్టె.
ఎవ్వరు న న్నిట్టు లీడ్చిరో యంచు
వెనుకకు దిరిగి నే వీక్షింపఁ బోవ,
మింటఁ దళుక్కన మెఱ పొండు మెఱసె;
మెఱపువెల్గునఁ గనుల్ మిఱుమిట్లు గొల్ప,
దేదీప్యమానమౌ దేహంబుతోడ
ఋషివతంసుం డైన కృష్ణదాసుండు

కనుపట్టుచుండెను గన్నులయెదుట
కనుపట్టు చున్నట్టిక్షణములోపలనె
పలు కొండు మత్కార్ణపర్వం బొనర్చె.

చచ్చియుందువు నేడు చచ్చియుందువుర,
బాలుఁడా, కొన్నాళ్లు బ్రదికియుండుమురః
చనిపోవ నీ కింక సమయంబు కాదు—
పలు కిట్లు మత్కార్ణపర్వం బొనర్ప
దృక్పథంబును బాసెఁ గృష్ణదాసుండు;
సంపూర్ణ మైనట్టి చైతన్య మబ్బె

* * * * *

* * * * *

వర్షంబు బోరనఁ బడుచుండె; నాదు
బట్ట లన్నియుఁ దడిపాత లైపోయెఁ
గాని లోనికిఁ బోవఁ గాక్షింపనైతి
ప్రకృతిపూరుషు లైనరాధికాకృష్ణు
లద్వైత మైనబ్రహ్మానంద మిచ్చె
ననుఁ బ్రోచు చున్న సుంతయుఁ జూడలేక
మచ్చరంబున నన్ను మాయింపఁ జూచి
కాలసర్పము చెంతఁ గన్పట్టియుండఁ
గృపఁ బూని నాపైని గృష్ణదాసుండు

ప్రతివతంసుండు కారణదేహాచారి
కాపాడె నను( గోరి—కాళ్ల యున్నప్పు
డే మానో నాగతి యీశ్వరా, యంచు(
దలపోసి తలపోసి తల(కంగ నేల
గురుకృపచే సమకూర(గా రాదె
యింకొక్కతరి నంచు నింటిలోపలికి
దడి యార్చుకొన మెల్ల( దరలిపోయితిని

* * * * *
* * * * *
* * * * *
* * * * *

ప్రకృతిపూరుషులేకభావంబునొంది
యద్వయానందంబు నందించు వేళ
ననుభవింప(గనీయ వడ్డముల్ పెక్కు
గురు వొక్క(డే దాని( గొనసాగ(జేయు;
ననుభవించినవా(డు సాక్షి యొక్క(డె.



## దుర్గకొండ

ప్రకృతిసౌందర్యంబు పరికించు వేళఁ
బురుషునిమహిమంబు నరసెడు వేళఁ
బలు తెఱంగులుగ నిర్మల మైనయట్టి
యానంద మెంతయో యలరారు చుండు;
అనుభవించుచు నున్నయప్పుడు నేను
గవి నంచు భావించి వివరింప నెంతు,
నితరులం దనుషంగ నెంతును గాని,
తెలుపఁబూనినదానిఁ దెలుపఁగాలేను;
పదములు తడఁబడు, వడఁకు నాలుకయు,
వెనుకముందు లెక్కింగి వివరింపలేను;
అనుభవించినవాఁడె సాక్షి దీనికిని.

* * * * *

శ్రీత్రయీమూర్తి, యాశ్రితచక్రపాలుఁ
డఖిలజగద్బంధుఁ డఖిలమిత్రుండు
సంతతసన్మార్గచరణదక్షుండు
ప్రాకటాశ్లేషాదరణబుద్ధి నొంది
పద్మినీమోద సంపత్కరుం డయ్యె.

మూఁడుమూర్తులకును మూలమై యొప్పి
ప్రవిమలం బైనభాస్వచ్ఛక్తిరక్తి
సింహాధిరూఢ మై శ్రీకరం బయ్యె.
భూభృద్వతంసులై పాలుపొందుఘనులు
జీవనప్రదు లౌచుఁ జెన్నారుకతన
నాడుచుఁ బాడుచు నానంద మొసఁగి,
యమృతకుల్యాతతు లందందుఁ బాఱె.
నవనవకాంతుల నలుగెలంకులను
వరిలక్ష్మి యానందవారి నోలాడె.
వరిలక్ష్మిఁ బూజించి భక్తిఁ జూపెంచు
పరమపవిత్రమౌ హరిదినం బయ్యె.
హరిసతీపూజయు, హరిపూజ గూడి,
యొక్కదినంబున నొప్పారుకతన
ద్విగుణీకృతం బయి విలసిల్లె భక్తి.
భుక్తిముక్తు లొసంగి పోషించు నంచుఁ
బగ లెల్ల రక్తియు భక్తియుఁ జూపి,
శ్రీసతీశ్వరపూజ, శ్రీప్రసాదంబు
గావించి, సేవించి, భావించి యుంటి;
అనురాగ మొప్ప సంధ్యాకాల మయ్యె.
సాంధ్యకృత్యములయాచారంబు దీర్పఁ,

ప్రకృతివైచిత్ర్యంబుఁ బరికించి చూడఁ,
బరమేశనామసంస్మరణం బొనర్ప,
నుత్సాహ మొంది, గ్రామోపకంఠమునఁ
బాఱుచు నున్న కాల్వసమీపమునకు
నల్లనల్లనఁ బోయి, యచ్చట నుంటి.

* * * * *

తూర్పుదిక్కునఁ దోఁచె దుర్గపర్వతము.

* * * * *

తన లేనిదినము దుర్దిన మంచు జనులు
తనకు నంజలు లిచ్చి కొనియాడు చుండఁ
బగలు కల్గియుఁ దమోభావంబు లేక
యరు లైన మెచ్చుకొన్నట్లు కృత్యంబు
లన్నియుఁ దీర్చి, లోకాంతరమ్మునకు
నినుఁడు పోవుచు నుండె; నిరుగెలంకులను
హరిఁ జూచి గిరిఁ జూచి యానంద మయ్యె.

* * * * *

ఖండచంద్రుఁడు మస్తకమునందుఁ గ్రాలఁ,
గేశపాశముగ నాకాశంబు తోఁడఁ,
జటులోరువృక్షముల్ జటలట్లు వెలుఁగ,
ఝరిణులు సర్పభూషలరీతి నొప్ప,

దుర్గేశుగతిఁ బొల్చె దుర్గపర్వతము.

*    *    *    *    *

జగ మొనర్చెడుకర్మసంచయంబునకుఁ
దాను సాక్షిగ నుండి తనశక్తిఁ జూపఁ
దనచేయుకర్మసంతతుల కేవేళ
సాక్షి యై యొప్పుదుర్గాధీశుఁ డనుచు
నతనిపాదము లంటి యర్చనల్ సేసి,
తనకరమ్ములఁ బవిత్రములఁ గావించి,
యాయనంతపదస్థుఁ డరిగె నొండెడకు.

*    *    *    *    *

అంతఁ బ్రదోషవేళారంభ మయ్యె.

*    *    *    *    *

పాఱు కాలువల శబ్దంబుగా నొప్పి,
రాచు వాయువుల స్పర్శంబుగా నొప్పి,
వ్రాలు పిట్టలను రూపంబుగా నొప్పి,
జాఱు తేనియల రసంబుగా నొప్పి,
దాఁగు పూవులను గంధంబుగా నొప్పి,
తన్మాత్రరూప మై ద్రవ్య మై యొప్పి,
మూఁడులోకములకు మూల మై యొప్పి,
నెన రొప్పఁ బ్రకృతియు నిండుగా నుండె.

శాంతతేజంబున సాక్షి నై యొప్పి,
కొలువున్నప్రకృతిని గోరి మెప్పింప,
దుర్గేశ్వరుండు సంతోషంబుతోడ
ధణధణంధణాలతోఁ దాండవం బాడె
తత్త్వమిత్యాదిశబ్దములఁ గొల్పుచును,
హరిమృదంగధ్వను లలమె నెల్లెడల.
నవనవకాంతుల నవకం బెసంగ,
నాకుపచ్చనిచీర యందం బొసంగ
వరిలక్ష్మి పాటలఁ బాడుచు నుండె.
స్వస్థానవాసు లై చనుభవ్యతరులు
సుమనశ్చయంబుతోఁ జుట్టుప్రక్కలను
నిజకలాపాలికల్ నేత్రపర్వముగ
సభ్యు లై దరి నుండుచంద మింపారె.
భూభృద్వరుఁడు సర్వభూతేశ్వరుండు,
దుర్గాధిపుండు ప్రదోషకాలమున
నారీతిఁ దాండవం బాడుచు నుండె,
రాణియై చెలువొందు ప్రకృతిదేవతకు
నానందసంధాయి యై వెల్గుచుండె.
దుర్గాధినాథుఁ డై తొలఁకాడుచున్న
రాజశేఖరునినర్తనవిద్య చూచి,

తన్మయం బయ్యెఁ జిత్తం బంత నాకు.
తత్త్వ మ్మటంచును ధ్వనియించు చున్న
హరిప్రక్క నేనును హరి నైనయట్లు,
స్వస్థానవాసి నై భాసిల్లు నేను
సుమనోవిలాసి నై సొంపొందినట్లు,
సభ్యాండ నై చూచుచందంబు తోఁచె.
అణురూపమునఁ దన్ను నటు చూచు చున్న
ననుఁ జూచి యీశుండు నగుమోముతోడ
నవ్యమార్గములఁ దాండవ మాడుచుండె.
జగ మంత యేకరీతిగఁ జూచు చుండి,
తన్మయానంద మందఁగఁ బోలు నైనఁ
బరమేశ్వరునినాట్యవైదుష్యమహిమ
నాకుమాత్రమె యన్న ననుపు కన్పట్టె.
ననుఁ జూచి మాత్రమే నాట్యం బొనర్చి,
నాకు నొక్కనికె యానందం బొసంగి,
యితరలోకం బేది యెఱుఁగనియట్లు
వర్ణనాతీత మా భావంబు కలిగె.
ఆరీతి దుర్గేశుఁ డాడుతాండవము
కనుఁగొని, ముదాబ్ధి మునుఁగుచు నుండ,
వేఱొక్కదృష్టి హృద్వీథిలోఁ దోఁచె.

## పాలవెల్లి

ప్రళయసంధ్యావేళఁ బరమేశ్వరుండు
సాక్షియౌ ప్రకృతి కుత్సాహం బొసంగఁ
దాండవం బాడుచందంబు కన్పట్టె.

ప్రళయసంధ్యావేళఁ బ్రకృతి చూడంగఁ,
బరమేశ్వరుఁడు తాండవం బాడు చుండ,
నపు డందు నే నున్నయట్లు కన్పట్టె.

ప్రకృతిదేవతలోనఁ బ్రకృతి నైనట్లు
పురుషునిలో నేను బురుషుఁ డైనట్లు
రెండురీతుల నాకుఁ బ్రీతి కన్పట్టె.

ఈశుతోఁ దాండవం బే నాడుచుంటి
నింతితో సాక్షిగా నేఁ జూచు చుంటి
నెందుఁ జూచినను నేనే తోఁచు చుంటి?

బురుషుండ నే నంచు నరయుచు నుండఁ
బ్రకృతిలోపల నున్నపగిదిగాఁ దోఁచె.
ప్రకృతి నే నంచును బరికించు చుండఁ
బురుషునిలో నున్నకరణిఁ గన్పట్టె.

ఈశునిలోపల నింతిలోపలను,
వెలుపల లోపల నలుగెలంకులను,
నేనె తోఁచుచు నుండి, నృత్య మాడుచును,
సాక్షిగాఁ జూచుచు, నానంద మొంద—

అంతలో—అపుడ—దృశ్యము మాఱిపోయె.

*     *     *     *     *

*     *     *     *     *

బుధగురుప్రముఖవిస్ఫూర్తి లేకుండె.
ఎదుటఁ గన్పడు చుండెఁ గృష్ణమేఘంబు;
శిఖిశిఖాకార మై చెల్వొందె మెఱుపు;
వేణునాదం బయి విలసిల్లె గర్జ.
యమునాజలం బయి యంధకారంబు
వ్యాపింపఁగాఁ జొచ్చె నన్నితావులను;
కాళీయఫణి యయి కన్పట్టె గిరియు;
సెలయేళ్లు నాగకాంతలుగా నెసంగె.
యమునాతరంగిణీహ్రదమధ్యమందు
శిఖిపింఛధరుఁ డౌచుఁ జెల్వొందుకృష్ణుఁ
డలకాళియాహిఫణాగ్రంబులందుఁ
దాండవం బాడుచందంబు కన్పట్టె
నాగకాంతల భయానందజం బైన
యాక్రందనధ్వని యలమె నెల్లెడల,
వరనారదోపేతపర్వతప్రాంత
జటులయానందంబు సాంద్ర మై యొప్పె
గోపికారామాదికోమలాకృతులు

శిఖరివ్రజంబును జేరి కన్పట్టె.
తన్మాత్రరూప మై తనరారుప్రకృతి
రాధికాకార మై రాజిల్లు చుండె.
రాధికాకార మై రాజిల్లుప్రకృతి
సాక్షి నై కనుఁగొంచు నానంద మొంద
సరసగంభీరసుస్వర మైనమురళి
మ్రోయించుచును నాట్యమును జేయుచున్న
కృష్ణసౌందర్యంబు ప్రీతిఁ గావించె.
ఆనృత్యమును జూచి యద్భుతం బంది
మఱి చూచి, మఱి చూచి, మఱి చూచి చూచి,
తన్మయం బయ్యెఁ జిత్తం బేకరీతి.
పర్వతప్రాంతానఁ బర్వతాకృతియు,
నారదసన్నిధి నారదాకృతియు,
గోపికాదుల మ్రోల గోపికాకృతియు,
ధరియించి, ధరియించి, తని వొందనైతి.
శిఖిశిఖారూప మై శిరమునం దుంటి,
మురళీనినాద మై మోవిఁ జేరితిని.
గాని, యింకను దృప్తి కాలేదు నాకు.
ప్రకృతిరూపం బైనరాధికాకార
మును దాల్చి సాక్షి నై కనుఁగొంచు నుండ,

సంకల్ప మొక్కటి జనియించె నాకు.
రాధ నై నృత్యంబు రహిఁ జూచు చుండఁ
గృష్ణుండ నై యాడ నిచ్ఛ జనించె.
కృష్ణరూపంబున నృత్యంబు సేయ
రాధ నై చూడంగ రాగంబు పుట్టె.
ఇంతలో నింకొక్కదృశ్యంబు తోఁచె.

* * * * *

ప్రళయకాలంబునఁ బ్రకృతి యంతయును
నేక మై సాక్షి నై వీక్షించు చుండఁ
గాలసర్పఫణాగ్రఘునరంగమందు
నాట్యంబొనర్చెడునటరాజమూర్తి
సాక్షాత్కరించె నాస్వాంతంబునందు.
నేను నే ననునట్టినేను నే నైతి
నే నైతిఁ బురుషుండు, నే నైతిఁ బ్రకృతి;
ప్రకృతిపూరుషు లైక్యభావంబు నొందు
నర్ధనారీశ్వరుం డైతి నంతంత,
హరిహరాకృతిఁ దాల్చి యలరారు చుంటి,
నద్వయం బైన బ్రహ్మాకృతిం దాల్చి
చిద్రూపి నై యుంటి; * * * *
* * * * * * * చెదరెఁ జిత్తంబు,

తలచూపెఁ గొంత చైతన్యంబు నాకు.

*　*　*　*　*

*　*　*　*　*

తొలుతఁ బచ్చికపైన నిలుచున్న నేను
దెపతెప నీటిలోఁ దేలుచు నుంటి.

వర్షంబు బోరనఁ బడుచుండె మీఁద;
వెల్లువ జోరున విలసిల్లెఁ గ్రిందఁ;
జిమ్మన నంతటం జీఁకటుల్ గ్రమ్మె;
నలుగెలంకులను గన్పట్ట దేమియును,
గుండియల్ తటతట కొట్టుకొం చుండె;
ఎందు నే నుంటినో, యెటు లుంటినొకొ,
యే మౌనొ నాగతి యెఱుక లేదయ్యె.

పరమేశ్వరుని మనఃపద్మమం దుంచి,
యాత్మభారం బంత నతనిపై వైచి,
యంధకారమునందు నద్భుతం బైన
జ్యోతిఃస్వరూపంబుఁ జూచుచు నుండి,
యతిభయంకర మైనయానందవారి
మునుఁగుచుఁ, దేలుచు, మునుఁగుచు నుంటి.

*　*　*　*　*

*　*　*　*　*

చచ్చెఁ జచ్చె నటన్నశబ్దంబు వచ్చె,
లేదు లేదనునొక్కనాదంబు వచ్చె;
లోఁతైనవెల్లువలో మునుంగుచును,
దేలుచు మునుఁగుచుఁ దేలుచు నున్న
నన్నుఁ జేతులతోడ నడుమను బట్టి
పై కెత్తి యొడ్డునఁ బడవైచి రెవరొ.

* * * * *

చయ్యన మఱికొంత చైతన్య మబ్బె.

* * * * *

నీటిలోఁ బడి మృత్యునికటంబు చేరఁ
గా నున్ననాపైని గారుణ్య మంది
దరిఁ జేర్చి కాచినధన్యుఁ డెవ్వండొ
యనుకొంచు వెనుకకు నరసి చూడంగ
మెఱసెఁ దళుక్కన మెఱ పొక్కఁ డపుడె.
దృక్పథంబును బాసెఁ గృష్ణదాసుండు

* * * * *

సంపూర్ణ మైనట్టిచైతన్య మబ్బె.

* * * * *

* * * * *

ఆకాశ మంత మేఘావృతం బయ్యె;
గాఢాంధకారంబు గప్పె నల్దెసల;

కాల్వ పాఱుచు నుండె గట్టులం డాసి;
తడిసినబట్టలు, వడఁకెడుకాళ్లు
కొయ్యవారినమేను గూడి బాధింప
నింటికి నొక్కండ నేతెంచు చుంటి.
కనఁబడ కున్నత్రోవను జూడ నైనఁ
దలఁ పొందఁగా లేక, జలమధ్యమందుఁ
గొట్టుకొన్నప్పటిఘోరసంతోష
మొక్కఁడే యూహించుచుంటిఁ జిత్తమున.

*　*　*　*　*

*　*　*　*　*

హా పరమేశ్వరా, హా కన్నతండ్రి,
ననుఁ గన్నతండ్రి, యనాథనాథుండ,
చిత్రంబు నీచర్య, చిత్రంబు తండ్రి,
యాపదుద్ధరణకార్యంబు చిత్రంబు,
ని న్నెందుఁ జిత్తాన నిలిపి నే నుందు,
భక్తుండ నైననాపైఁ గటాక్షంబు
పలుతెఱంగులఁ జూపి యలరించినావు,
నీవు న న్నరయనినిముసంబు లేదు;
నీవు నన్ బ్రోవనినిముసంబు లేదు;
కాని, సంపూర్ణ మహాకరుణను జూపి,

యినుమారుమాత్రమే ననుఁ బ్రోచినావు.
మనసులో మనసుగా మని యున్నయట్టి
తనువులోఁ దనువుగాఁ దనరారినట్టి
యాత్మలో నాత్మగా నలరారినట్టి
ప్రాణేశ్వరిని నాకుఁ బాపియున్నట్టి
యాభయంకర వేళయం దొక్క-మాఱు,
పాలవెల్లువలోనఁ బడి జీవితాశ
విడిచి, కాల్సేతులు విసరుకొం చున్న
యీభయంకరవేళ నిపు డొక్క-మాఱు.
పూర్ణమోదంబును బొందించినావు;
ఆపదలం బాపి యరసి కాపాడు
అప్పటి శాంత మహా నానంద మద్ది
యానంద మైనచందానఁ గన్పడదు.
ఆపదలో మున్గినపుడు నిక్క దలఁచి,
యాత్మభారము నీకు నర్పించువేళ
నతిభయంకర మైనయాకృతిం దాల్చి
డెందానఁ గల్గునానంద మానంద
మట్లు—సంపూర్ణ మహానానంద మట్లు—.
అద్వైత మైనబ్రహ్మానంద మట్లు—
కనుపట్టు చుండును గాన నా కట్టి

యానంద మిచ్చి నన్నాదరించితివి.
నీకుఁ గృతజ్ఞుండ, నీకు భక్తుండ,
నీకు సేవకుఁడను, నీకు దాసుండ,
ననుచు నేమేమియో యనుకొంచు నవలఁ
గృపఁ బూని నాపైని గృష్ణదాసుండు
వ్రతివతంసుండు కారణదేహాచారి
నన్నుఁ గాపాడుచు నున్న చందంబు
తలపోసి, గురువు లందఱకు నైజంబు
గా నొప్పనిష్కామకరుణకు మెచ్చి,
యల్లనల్లన నింటి కరుగుదెంచితిని.

* * * * *
* * * * *
* * * * *
* * * * *

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించువేళఁ
బురుషునిమహిమంబు నరసెడువేళఁ
గలుగుభావము లన్ని తెలుపఁగాఁజాల;
అనుభవించిన వాఁడు సాక్షి యొక్కండె.



## అ ల సి పో యి తి ని

అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని,
కటకటా నీ కింతకాఠిన్య మేల ?

*  *  *  *  *

తిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును;
వెదకితి వెదకితి వేసారిపోతి;
ఏమూల నుంటివో యీచలం బేల,
యెందు దాఁగుంటివో యేల కన్పడవు ?

*  *  *  *  *

అలసిపోయితి నయ్యో అలసిపోయితిని,
కటకటా నీ కింతకాఠిన్య మేల ?

*  *  *  *  *

గట్టుపైఁ బుట్టపైఁ గాల్జారి జారి
పడుచు లేచుచు ముండ్లబాట లన్నియును
వెదకితి వెదకితి విసివిపోయితిని,
దిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును;

*  *  *  *  *

అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని,
కటకటా నీ కింతకాఠిన్య మేల ?

*  *  *  *  *

ఆకసంబున మబ్బు లలముకొన్నపుడు
చీఁకటి యంతటం జెదరియున్నపుడు
వర్షంబు బోరనఁ బడుచున్నయపుడు,
తిరిగితిఁ దిరిగితిఁ దెరవు దప్పితిని;

* * * * *

అలసిపోయితి నయ్యొ అలసిపోయితిని,
కటకటా నీ కింతకాఠిన్య మేల?

* * * * *

గాలి వీచుచు భీతిఁ గలిగించువేళ
చెట్టుకొమ్మలు మీఁద నట్టాడువేళ,
ఊపి రాడక చిత్త ముస్సు రను వేళ,
వెదకితి వెదకితి వేసారిపోతి;

* * * * *

అలసిపోయితి నయ్యొ, అలసిపోయితిని,
కటకటా నీ కింతకాఠిన్య మేల?

* * * * *

ఏవంక నుందువో యెఱుక లేదయ్యొ,
త్రోవ తప్పితి నయ్యొ, త్రోపుపా టయ్యొ,
త్రోవ చెప్పినవాఁడు తోడ రాఁడయ్యొ,
ఈవేళ నా కేల నిట్టిపా టయ్యొ!

* * * * *

అలసిపోయితి నయ్యొ, అలసిపోయితిని,
కటకటా, నీ కింతకాఠిన్య మేల?

---

## మో హి ని

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించువేళఁ,
బురుషుని మహిమంబు నరసెడువేళ,
వివిధంబులై తోఁచుఁ బ్రేమతత్త్వంబు;
తల్లినై, పడఁతినై, తనయనై యొప్పి
ప్రకృతి యానందంబు పరగించుచుండఁ
గొడుకయి, మగఁడయి, వడిఁ దండ్రి యగుచుఁ
బురుషుఁ డానందంబుఁ బొందుచు నుండు;
ప్రకృతిపూరుషు లైక్యభావంబు నొంది
యద్వైత మైన బ్రహ్మానందమందు
మునుఁగుచుఁ దేలుచు, మునుఁగు చున్నపుడు
కోటిజన్మము లిట్లు కోరుచు నుండు;
అనుభవించినవాఁడు సాక్షి దీనికిని.

*   *   *   *   *

*   *   *   *   *

శ్రీసర్వమంగళాకృతిఁ దాల్చుచుండి,
యార్యాభిధేయభవ్యయశంబు నొంది,
తగునపర్ణత్వంబు తరిగిపోకుండ
నన్నపూర్ణఖ్యాతి నతిశయం బంది,
యర్థిసతత్వ మన్వర్థ మై యొప్పఁ

దన్నుఁ గొల్చుచు నున్నతనయున్ను మిన్నఁ
బ్రోవంగఁ దలఁపొందిఁ బ్రోది మీఱంగఁ
దనువునఁ దను విచ్చి తాని పొందఁ జేసి,
మనసున మన సిచ్చి మని యుండఁ జేసి
యాత్మ నాత్మ యొసంగి యలరారఁ జేసి
తనశివాభిఖ్యాతి ధన్య మానట్లు
బుధ.గురుశేఖరభూరియశుండు,
సర్వజ్ఞుఁ డైశ్వర్యసహితుండు హితుఁడు,
క్షీరంబు శర్కరఁ జేరి యున్నట్టు
లేకరూపంబున నింతితోఁ గూడి
యేక మై యొప్పారునీదివ్యమహిమ
యెఱిఁగి దేవునిఁ గొల్వ నేర్పడ్డదినము,
శివరాత్రి యనుపేరఁ జెల్వొందుదినము,
మాఘకృష్ణచతుర్దశీఘనదినము,
చనుదెంచి నాకు నుత్సాహం బొసంగెఁ
దనివి తీరఁగ నీశుఁ దలఁచితిఁ గొలువ.

* * * * *

ఈశుఁ గొల్వఁగ నెంచి, యిలు వీడిపోయి
యందందుఁ దిరుగాడి, యల్లన నడచి,
యబ్ధిఁ జేరితిని సంధ్యాకాలమునకు.

సంజకెంజాయలు సరసంబు లగుచు
నంబుధిలోఁ బ్రతిబింబించు చుండి,
యెన్న శక్యము కానిహృత్ప్రీతి నొసఁగె.
అంత నొయ్యొయ్య నంధకారంబు
వ్యాపింపఁగాఁజొచ్చె నన్ని తావులను.
ఆకాశపథమున నలరునీలిమము,
నంభోధితలమున నలరునీలిమము,
నంధకారంబున నలరునీలిమము,
మూఁడుత్రోవలయందు ముత్తెఱంగులుగ
నేక మై మనమున కింపు గావించె.
మూఁడుత్రోవలయందు మొనసి యున్నట్టి
పరమేశ్వరునిమహాభావంబువోలె
మూఁడుతెఱంగుల మొనసియున్నట్టి
యంధకారంబున నద్భుతం బైన
జ్యోతిఃస్వరూప మత్యుత్సాహ మొసఁగె.
లోకజాలమ్ములు, లోకనాయకులు.
లోకస్థు లుండఁగ, నలోక మైనట్టి
యంధకారంబున కవ్వలిత్రోవ
నాదిత్యకాంతి నేకాకార మగుచు
నలరుదివ్యజ్యోతి యద్భుతం బొసఁగె.

ఆరభటీవృత్తి నలరుతాండవము,
కైశికీవృత్తిసంగతుల లాస్యంబు,
అంగవిక్షేపవిద్యలను నృత్యంబు
వివిధరసంబుల వెలయునాట్యంబు
నెఱుదెలుంగులనృత్తనైపుణిం జూపి,
నృత్తానునృత్త మై నెగడుచందమున
మంద్రమధ్యమతారమహిమముల్ వెలయ
భావానురూప మై పరగురాగంబు,
రాగానురూప మై ప్రబలుభావంబు,
ప్రకటించి గీతవైభవములం జూప,
గీతానురూపవిఖ్యాతరీతులను
దత్త్వమిత్యాదిశబ్దములఁ గొల్పుచును,
రాగభావములమార్గములందు నిలిపి,
లయయుక్తవాద్యలీలలఁ గోరి చూపి,
వాద్యవైభవముల వాసి నొప్పారు
నృత్తగీతంబులనిపుణతల్ వెలయ
తౌర్యత్రికంబు నందంబు మీఱంగఁ
బ్రకటించి, భావముల్ రసములు నొకట
వివిధభేదంబుల వివిధరీతులను
వెలయించు చున్నట్టివీచికాతతుల

క్రీడావిశేషముల్ ప్రీతి గావించె.
అంధకారములోనియద్భుతం బైన
జ్యోతిఃస్వరూపంపుఁ జోద్యంబు నడుమ
వీచికానృత్తంపువిభవంబు సూచి
తన్మయం బయ్యెఁ జిత్తం బంత నాకు.
వీచికానృత్తంబు వీక్షించు చుండి,
తన్మయం బైనచిత్తంబందు నంత
వింతయానందంబు విలసిల్లు చుండె.
అంత వింతగ మార్పు లందెఁ జిత్తంబు.
లేవు తరంగముల్, లేదు సంద్రంబు.
లే దంధకారంబు, లేదు రావంబు.
కోటిభాస్కరు లొక్కచోటనే కూడి
భాసిల్లురీతి దివ్యజ్యోతి యొప్పె.
ఆజ్యోతి మధ్యంబునం దొక్కకోటి
మన్మథుల్ గుమికూడి మని యున్నరీతి
సౌందర్యరాశి యై జా నొందు చున్న
మోహినీరూప మామ్రోలఁ గన్పట్టె.
కర్పూరకస్తూరికాగంధములకు
మిన్న యై యున్ననెమ్మేనిగంధంబు
పృథ్వీస్వరూప మై ప్రీతి నింపంగ,

# పాలవెల్లి

జాలు జాలుగఁ బెక్కు లీలలం జూపు
లావణ్యరసము జలం బయి యొప్ప
తళుకుతళుక్కని తనివి గావించు
తనుకాంతి తేజోవితానంబు నింప,
సరసశీతలమృదుస్పర్శంబు గొల్పు
చూపులు వాయుసంశోభలం బూనఁ,
గలదు లే దనునట్టి లలితమార్గంబు
గగనతత్వంబును గన్పట్టఁజేయు,
భూతపంచకముఁ బొల్పారుచున్న
యంద మంతయు నొక్కయాకార మొంది,
మూఁడులోకంబుల మోహింపఁజేయు
నామోహినీరూప మటు చూచిచూచి
మోహజాలంబున మునిఁగితి నేను.
మోహినీరూపంబు ప్రేమఁ గన్గొనుచు
మోహజాలంబున మునిఁగిపోవుచును
జెదరని బెదరని చిత్తంబుతోడఁ
గదలక మెదలక * * * *
* * * * యెదుటఁ గూర్చుంటివి.
కదలక మెదలక కనుచున్న నన్నుఁ
గదలక మెదలక కనుచుండెఁ గాంత.

కాంత నిశ్చలబుద్ధిఁ గనుచుండె నన్ను
నేను నిశ్చలబుద్ధి నింతిఁ గాంచుంటి;
నేను మోహిని మోహించి కంచుంటి!
మోహినియును నన్ను మోహించి చూచె;
నిశ్చల మ్మై యిట్లు నిలుచున్న కాంత
నిశ్చలత్వము మాని నృత్తంబు సలిపె.
నృత్తానువృత్త మై నెగడుచందానఁ
దాళమానములు పాదంబులం గొల్పె.
హస్తనేత్రగ్రీవహారిభేదముల
నభినయ మ్మొనరించి యందంబు గొల్పె;
భావరాగంబులప్రౌఢి చెన్నొంద
ననుపుంబు పుట్ట గానంబు గావించె;
భావానుగుణ మైనవనితరాగంబు,
రాగానుగుణ మైనరమణిభావంబు,
తాళానుగుణము లై తనరారుచుండె.
భరతశాస్త్రప్రౌఢి పరిఢవిల్లంగ
నృత్త మిమ్మెయి నాచరించుచు నున్న
భువనమోహనరూపమును గాంచికాంచి,
తన్మయంబయ్యెఁ జిత్తం బంత నాకు.
భువనమోహిని యైన మోహినిం జూచి,

మోహించి, మోహించి, మోహించి యంతఁ
దన్మయం బైనచిత్తము తత్తరింపఁ
గౌఁగిలింపఁ దలంచి, కాంత చెంతకును
వడివడివడిఁ గాఁగఁ బరువు లెత్తితిని.
పరుగెత్తి తనవైపు వచ్చున న్గాంచి
వడివడిఁ గాంతయుఁ బాఱిపోసాగె.
భువనమోహిని ముందుఁ బోవుచు నుండ
నింతిని వెన్నాడి యేఁ బోవు చుంటి.
పరు వెత్తి పరు వెత్తి వచ్చునన్ జూచి
వడివడిఁ గాంతయుఁ బరు వెత్తు చుండె.
అలసియు సొలసియు, నాయాస మొప్ప
మెల్లమెల్లఁగ నేను మెలఁగుచు నుండ,
మెలమెల్లఁ జెంత నే మెలఁగె నింతియును;
మెల్లమెల్లనె చెంత మెలఁగుచు నున్నఁ
జిక్కె మోహిని, చేతఁ జిక్కె నం చెంచి,
వడివడి నింతిని బట్టుకోఁ బోవ,
వడివడి దవ్వుగాఁ బాఱె నింతియును;
కాంత చెంతకు రాఁగఁ గడు నాశఁ బొంది,
కాంత దవ్వుగఁ బోవఁ గడు వంతఁ బొంది,
యాశయు వంతయు నట్టిట్టు కొల్ప

నుట్టూరాతయుయ్యాల లూఁగెఁ జిత్తంబు.
మోహినిఁ గనుఁగొని మోహంబు నొంది,
మోహంబు విడువ కుత్సాహంబుతోడఁ
బట్టుకోఁ గౌఁగిటఁ బెట్టుకో నెంచి,
పరు గెత్తి పరు గెత్తి పరు గెత్తలేక,
యలసియు సొలసియు నాయాస మొంది,
యాయాసమందు దుఃఖానంద మొంది,
నిట్టూర్పు నిగుడించి, నిలిచి, నిరాశ
ననునయాలాపదీనాస్యుండ నగుచు
నతికరుణంబుగాఁ బ్రార్థించు చుంటి.
అతిదీన మైన నాయాలాప మింతి
యాలించి నాపైని జాలి చూపించె;
జాలి చూపించి నాసరస కేతెంచె;
సరస నాకౌఁగింటఁ జనవున నిమిడె.
కాంత కౌఁగిటిలోనఁ గలసి యున్నప్పు
డానందవార్ధి మున్గాడుచు నుంటి
నానందరూపుండ నై వెల్గుచుంటి;
నంతలోఁ గను విచ్చి యరసితి మరల.
మోహిని మై నన్ను మోహజాలమున
ముంచినమోహినీపూర్వరూపంబు

పూర్వరూపము లేక పూర్వమై తోఁచె.
తనువునఁ దను వుంచి తని వొందునట్లు
మనసున మన సుంచి మని యుండునట్లు
ఆత్మైక్యమును బొంది యలరారునట్లు
తలపోంది, యాశ నేఁ దన్ను వెన్నాడఁ
గాంత కౌఁగిటఁ జేరి, కరుణఁ జూపించి,
యంతలోఁ దనరూప మప్పుడే మార్చె.
మోహిని భార్యమై మోహింపఁజేయ,
నేనె భర్త న టన్నమోహకతో నుంటి;
భార్యచందానఁ గన్పట్టుమోహినియు
భార్యాస్వరూపంబు బాసెఁ దత్క్షణమె.

* * * * *

ప్రేమరూపులలోన వెలయుచు నుండఁ
జల్లనిచేతులు చాపి, కౌఁగింట
ననుఁ జేర్చి, తనివార నన్ను ముద్దాడి,
యననుభూతానందమందు నను ముంచె.
ప్రేమస్వరూప మై ప్రీతి నింపుచును
మ్రోలఁ గన్పడు చున్న మోహినిఁ జూచి,
సాష్టాంగముగ నమస్కారమ్ము చేసి,
"అమ్మ, ని న్నెన్నాళ్లో కరసితి నమ్మ,

నిన్నుఁ జూడనియొక్క నిముసంబు నాకు
యుగమయి తోఁచు, న న్నోమవే తల్లి;
చల్లనినీచేయి చాలు నోయమ్మ,
చల్లనినీచూపు చాలు నోయమ్మ—"
యనుచు నిమ్మోయిఁ బల్కి, యమ్మపాదములు
కరములఁ బట్టుచుఁ గనుల నద్దుచును,
భక్తిభావమును, విశ్వాసభావంబు
చూపించి, ముదమునఁ జొక్కుచు నుండ.
మఱియొక్క రీతిగా మాఱె నింతియును.

* * * * *

ముద్దు గాఱుచు నుండె ముద్దునెమ్మోము;
ముద్దు గాఱుచు నుండె ముద్దుఁజూపులును;
ముద్దు గాఱుచు నుండె ముద్దుఁజేతులును;
ముద్దు గాఱుచు నుండె ముద్దుఁబాదములు—
ముద్దులమూట నై మ్రోల నిల్చున్న
ముద్దుబిడ్డను జూచి ముద మొందు చుంటి.
చిన్నారిపొన్నారిచిగురుఁజేతులను,
నవ్వుచుఁ గేరుచు, ననుఁ గౌఁగిలించి,
ముద్దాడు చున్నట్టిముద్దులబిడ్డఁ
గనుఁగొని, కనియును వినియును దొల్లి

యనుభవింపనియపూర్వానందమందు
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచు నుంటి.
ముద్దులు గురియుచు, మ్రోలనిల్చున్న
ముద్దుబిడ్డను జూచి, ముద్దు లాడుచును,
కౌఁగింట నిలుచుచు, కౌఁగిలించుచును!
అనను భూతానంద మందు మున్గాడి,
యలరారు చున్నప్పు డంతంత—వింత!
ఒకమార్పు కనుపట్టె నొక్కసారిగనె.

*   *   *   *   *

ఎదుట నొప్పుచు నున్నయింతిని జూడఁ
బరిపూర్ణ మౌ ప్రేమ పరగె నాయెదను.
కౌఁగిటఁ జేర్చితిఁ, గౌఁగిట నుంటి!
ముద్దాడు చుంటిని, ముద్దిడు చుంటి;
కాని సందేహంబు గలిగె నాయెదను.

*   *   *   *   *

మోహంబు గొల్పుచు మ్రోల నిల్చున్న
యింతి యెవ్వతెయొ, నే నెవ్వాఁడనొక్కొ-
యేర్పర్ప లేనైతి నించుకంతయును.
ముద్దుఁజూపులతోడ మురిపెంబు నింపి,
కన్నతల్లి య టన్నకరణిఁ గన్పట్టె.

ముద్దుఁజూపులతోడ మురిపెంబు నింపి,
యాత్మేశ్వరి యటన్న యనువున నొప్పె.
ముద్దుఁజూపులతోడ మురిపెంబు నింపి
యనుఁగుబిడ్డ యటన్న హరువున నొప్పె;
పడఁతినై తల్లినై కడుఁ బ్రీతి నొసఁగి,
తల్లినై బిడ్డనై తనివొందఁజేసి,
బిడ్డనై యింతినై ప్రియ మొందఁజేసి,
వివిధవిధంబుల విలసిల్లుచున్న
ప్రేమస్వరూపంబు ప్రీతి మీఱంగ
ననుభవింపఁగఁజేసి, యానందమందు
నన్ను ముంచుచు నుండ, నన్నిరీతులను
మగఁడనై కొడుకనై మఱి తండ్రి నగుచుఁ.
బరిపరివిధములఁ బరిఢవిల్లఁగ
నానందవార్ధి మున్గాడుచు నుంటి
నానందపీయూష మది గ్రోలు చుంటి
నానందరూపుండనై వెల్గుచుంటి,
ఎంతసే పుంటినో యెఱుఁగ నిమ్మాడ్కి—

*　　*　　*　　*　　*

*　　*　　*　　*　　*

ఇంతలో నక్కటా, యేకతంబుననో

చప్పున నొక్కింత చైతన్య మబ్బె.
చైతన్య మబ్బినసమయంబునందు
గాఢాంధకారంబు గప్పె నద్దెసల—
తడిసిన ట్లుండె పాదంబులు రెండు—
కెరట మొక్కటి వెన్క కరుగుచు నుండె—
సంపూర్ణ మైనట్టిచైతన్య మబ్బె.
ఆకాశపథమున నలరునీలిమము
నబ్ధితలమ్మున నలరునీలిమము
నంధకారంబున నలరునీలిమము,
మూఁడుత్రోవలఁ గప్పి మొనసి కన్పట్టె.
తరఁగలనురుగులు తళ్కుతళ్కనుచు
నంధకారముఁ జీల్చి యలరారుచుండె,
పాటలఁ బాడుచు, నాట లాడుచును,
గెరటంబు లెదుటనే క్రీడించుచుండె.

* * * * *

అట్టిచీఁకటివేళ నంబుధిచెంత
నొక్కండ నుండుట కుత్సహింపమిని
బరమేశుఁ దలఁచుచుఁ బరిపూర్ణభక్తి
నింటికి నొక్కండ నేతెంచుచుంటి.
చీకటి యంతటఁ జిక్కనై యుండె;

త్రోవ కన్పడ కుండ డ్రోపుంబా టయ్యె.
చిత్త మీశునిపైని జేరియే యుండె.
"హా పరమేశ్వరా, హా కన్నతండ్రి,
చిత్రంబు, నీచర్య చిత్రంబు తండ్రి!
ప్రకృతిపూరుషులరూపంబులు దాల్చి
చిత్రవిచిత్ర మై చెలువారు చున్న
ప్రేమతత్త్వంబును వివిధరీతులను
సంపూర్ణ మైనయుత్సాహంబు తోడ
ననుభవింపఁగఁజేసి, యానంద మిచ్చి
నిన్ను సేవింపంగ, నిన్నుఁ గూడంగ,
నిన్నుఁ జేరంగను, నిన్నుఁ బొందంగఁ,
దగురీతులను జూపి, తని వొందఁజేసి,
ననుఁ బ్రోచు చున్ననీనవ్యవైభవముఁ
గొనియాడ నేర్తునే, కోటివే లైన
జన్మంబు లెత్తఁగా శంక నా కేల ?
నీవు న న్నరయని నిముసంబు లేదు.
నీవు నన్ బ్రోవని నిముసంబు లేదు,
వివిధవిధంబులఁ బ్రేమ చూపించి
నన్నుఁ బ్రోచుచు నీవు ననుఁ జూచు చుండ,
నానందమే కాని యన్యంబు లేదు,

ఆనందరూప మై యలరు నంతయును.
అనుచు నేమేమియో యనుకొంచు, నవల,
అందియు నందక యూయూసపెట్టి,
దొరకియు దొరకక తొందరపెట్టి,
తనుఁ బట్టుకోఁ జూచి ననుఁ జేరరాక,
ననుఁ బట్టుకో నెంచి నా కందరాక,
యలయించి, సొలయించి, యూయూసపెట్టి,
యూయూసమం దొక్కయద్భుతం బైన
యానంద మిచ్చి, న న్నాదరం బొప్పఁ
గనుఁగొన్న మోహిని కన్నులం గట్టి
నట్టులు కన్పట్టిన ట్లున్నకతన
జరిగిన దంతయు మఱచిపోలేక,
మఱిమఱి తలఁచుచు నఱిముఱి గొనుచు,
నల్లనల్లన నింటి కరుగుదెంచితిని.

*　　*　　*　　*　　*

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించు వేళఁ
బురుషునిమహిమంబు నరసెడు వేళ,
వివిధంబు లై తోఁచు ప్రేమతత్త్వంబు
ననుభవించినవాఁడు సాక్షి యొక్కండె.

---